మానఁడు. దానికి విఘ్నముకలిగినఁ బరితాపపడును. భగవన్నామస్మరణము రత్నము. ముక్తి గాజుపెంకు.

స్మరణమునందును ధ్యానమందును దొలుత నితరచింతలురాక మానవు. వానిని క్రమక్రమముగ నిలిపివేయవలయును. అంత వఱకు నవివచ్చి విఘ్నముకలిగించునని వ్యసనపడఁబనిలేదు. సర్వము భగవన్మయమే. కావున నవియు భగవన్మయమేయనియు భగవంతుని పనుపున నవి వచ్చినవనియుఁ దలఁచినయెడల వానియందుండు విషము పోయి యాకాలముకూడ భగవద్విషయమందే కడపినట్లగును.

భక్తియనుతీఁగ యల్లుకొనుటకు శ్రద్ధయను ప్రాపుండవలయును.

ఒక ప్రియపదార్థమును నేకాగ్రతగఁ దలంచునపుడు కన్నులు చెవులు పనిచేయవు. అట్టులే తక్కిన ప్రపంచమునకంతయు నీవు గ్రుడ్డివాఁడవు చెవిటివాఁడ వగుము. నాలుక మాత్రము విసుఁగు లేక హరిస్మరణ చేయుచుండనిమ్ము. అప్పుడప్పు డర్థానుసంధానము చేయుచుండును.

లోఁతు తెలియరాని నీటిలోని మీను భగవంతుఁడు. గాలము ములికి నామము: మన మనస్సు దానిని గట్టిన దారము. చేఁప యున్నదో లేదో యాగాలమునకుఁ జిక్కునో చిక్కదో యని దారమును వదలినఁ జేఁప చిక్కునాశ లేదు.

ప్రభువును మన యింటికిఁ బిలుచు నుద్దేశము కలదేని యిల్లంతయు శుభ్రముగానుంచి యలంకరింతుముకదా. అట్టులే హరికి వాసస్థానము చేయఁగోరు మన హృదయమును బరిశుభ్రపఱచి నిర్మలముగా నుంచవలయును.

భగవంతునికంటె భగవన్నామము బలీయము. ద్రౌపదీ కరిరాజ నారద ప్రహ్లాదాదుల రక్షించినది నామమేకదా. వాల్మీకి పఠించినది రామనామమేకదా. కృష్ణుఁడు సమీపమందుండియు ద్రౌపదీ పుత్రుల రక్షింపనేరఁడయ్యె. ఆయన నామము ద్రౌపదిని రక్షించె. రాముఁడు శరణుజొచ్చిన సముద్రుఁడు వినఁడయ్యె. రామనామము స్మరించి హనుమంతుఁడు సముద్రము దాఁటెను. కావుననే పెద్దలు

నామస్మరణముకన్న సంసారసాగరముఁ దరింప వేఱుపాయము లేద నిరి. కావున బుద్ధిమంతులగువారు యమనియమములఁ బాటించి సాత్త్వికాహారము మితముగఁ గొనుచు నుభయవిధ బ్రహ్మచర్యము లలో నేదైన నొకదానిని గ్రహించి యర్థానుసంధానపూర్వకముగ భగవన్నామము నిరతము స్మరించుచుండుటవలన మోక్షకారణమైన పరభక్తి లభించును.

నిర్మలముగానుండు నద్దమునందే వస్తువులు ప్రతిఫలించును. కదలెడి నీటియందు సూర్యబింబము కానరాదు. కావున హృదయ మున భగవంతుఁడు సాక్షాత్కరింపవలయుననిన దానిని నిర్మలము గాను కలఁతజెందనిదానినిగా నుంచుకొనవలయును. దీనికి రాజ యోగము సహాయపడఁగలదు. భక్తి యనెడు పక్షికి జ్ఞానయోగ రాజయోగములు ఱెక్కలు. కావున వీనిని సహాయముగఁ గొనుట మేలు. యోగవిషయమున స్త్రీలకుఁ బురుషులకు నొక హెచ్చరిక యియ్యవలసియున్నది. ఈకాలమున యోగము పశ్చిమద్వారమున వచ్చుచున్నది. కావున శుద్ధముగా లేదు, యోగము పూర్ణముగఁ దెలియకయు యోగము నేర్పెదమని పెక్కురు మోసగాండ్రు శిష్యుల శిష్యురాండ్రను ధనాశచేతను గామాతిరేకముచేతను జేర్చుకొను చున్నారు. చెఱుచుచున్నారు. కావున యోగాభిలాషులు హెచ్చ రికకలిగి తగినవారిని గురువులుగ వరింపవలయును. లేకుండిన నుభయ లోక భ్రష్టులగుదురు. ఇప్పటికే గ్రంథము పెద్దదగుటను ముద్రింప ధనములేమిచేతను వీనినిగుఱించి వ్రాయ సాధ్యపడదయ్యె.

శ్లో॥ హరేర్నామైవ నామైవ భవభేషజమ్
కలౌనాస్త్యేవ నాస్త్యేవ, నాస్త్యేవ గతిరన్యథా॥

---

న్యూ విజయ ఆర్టు ప్రెస్ - తెనాలి.